అణాగ్రంథమాల ౮.

# కాంగ్రెసు చరిత్ర

## రెండవభాగము.




గ్రంథకర్త:-

జానపాటి సత్యనారాయణ

కార్యాలయము:-

అణా గ్రంథమాల

౩౬౯౧, తురుపుబజారు, హైద్రాబాదు-దక్కన్.

ముద్రితులు:-

కొండా శంకరయ్యగారి ప్రిమియర్ ముద్రాక్షరశాల,

సికింద్రాబాద్.

నవంబరు ౧౯౪౦.

వెల ౦-౧-౦

# అమ్మకమునకు సిద్ధము

## హోలి, కల్దారు మారకము జంత్రి

లేక

## కల్దారు, హోలి మారకము జంత్రి

ఇందు కల్దారును హాలి మార్చుటకు హాలిని కల్దారును మార్చుటకు, ఒక పై నుండి ఒక వెయ్యి రూపాయలవరకు సరిగా లెక్కగుణియింప బడినది. రూ॥ ౧౧ర నుంచి రూ॥ ౧_౨౦ వరకు ప్రతి వొక అణా హెచ్చింపుతో లెక్కలు దమ్మిడీతోసహా వేయ బడినవి. పుటలు ౨౦౦ లకు పైగా బయిండు చేయ బడినది.

వెల రూ. ౧_౦_౦ కంపిని.

పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

# ప్రకాశకుల నివేదన.

అణా గ్రంథమాల స్థాపించి సంవత్సరము అయిపోవచ్చినది. ఇదివరకు ౭ పుస్తకములు వెలువడినవి. యిది ఎనిమిదవ పుస్తకము. మరి నాల్గు పుస్తకములు యీ నెల ఆకరు వరకు వెలువడును.

ఒక సంవత్సరముకు సభ్యులుగా చేరినవారి చందా అయిపోవచ్చినది. మా క్రొత్త పద్ధతి ప్రకారము అనగా ౧౦౦ పుస్తకములకు చందా ౫ రూపాయిలు. ప్రతి సంవత్సరము ౨౫ పుస్తకములు వెలువడును. ఈ పద్ధతి ప్రకారము సభ్యులుగా చేరువారు, యిదివరకు యిచ్చిన ఒక రూపాయి పోగా మరి ౪ రూపాయిలు చందా మరి ౨ రూపాయిలు పోస్టుచార్జికిగాను మొత్తము ౬ రూపాయిలు పంప ప్రార్థితులు. ౧౯౪౦ సంవత్సరం ఆఖరువరకు మా గ్రంథమాలనుండి ౨౫ పుస్తకములు వెలువడును.

మా గ్రంథమాలకు "కాంగ్రెసు చరిత్ర" అను పుస్తకము వ్రాసియిచ్చిన శ్రీ జానపాటి సత్యనారాయణగారు, మరియు పీఠిక వ్రాసియిచ్చిన శ్రీ మందుముల రామచంద్రరావుగారికిని కృతజ్ఞతా వందనములు తెలుపుచున్నాము.

ఇట్లు
వెల్దుర్తి మాణిక్యరావు
కే. సి. గుప్త
ప్రకాశకులు.

# దేశోద్ధారక గ్రంథమాల

సికింద్రాబాదు.

సంవత్సరమునకు ౪ పుస్తకములు.

సుమారు ౪00 పేజీలు. చందా ౧-౮-0 మాత్రమే

౧౦ పుస్తకములు వెలువడినవి.

---

# వైదిక ధర్మ గ్రంథమండలి

౫౦౧ దేవిదీన్ బాగు, సుల్తానుబజారు, హైద్రాబాదు.

300 పేజీలకు మించిన పుస్తకములు

సంవత్సరం చందా ౧-౪-0 మాత్రమే పోస్టేజితో సహా.

౪ పుస్తకములు వెలువడినవి.

ఈశ్వరుడు మొదలగు రెండు పుస్తకములు త్వరలో వచ్చుచున్నవి.

---

# "రెండో ప్రపంచ యుద్ధమా?"

మొదటి భాగము కొలది ప్రతులు మాత్రమే మిగిలియున్నవి.

రెండవ భాగము సిద్ధమయినది.

'ఫిన్ లాండు విధ్వంసము'
'పోలండు పతనము'
'ఫ్రాన్సు యుద్ధము'
'............'
ఇంకా ఎన్నో విషయాలు.

వెల ౬ అణాలు.

చందా దారులకు ఉచితము.

ఆంధ్ర కేసరి గ్రంథమాల.

౧౭౮, సుల్తాన్ బజారు, హైద్రాబాదు-ద.

వందేమాతరమ్

# కాంగ్రెసు చరిత్ర

## రెండవ భాగము

—:—

మహాత్ముని తీవ్రతను గమనించి రానున్న ముప్పును దాటు కోరికతో వైస్రాయి ఒక ఎత్తు వేసెను. ఇంగ్లాండు వెళ్లి భారతదేశములో మరల తీవ్రపరిస్థితులు రానున్నవని అచ్చటి వారికి తెలియజేసి వారి సలహాలను గైకొని భారతదేశము నకువచ్చి ఒక ప్రకటన గావించెను. "కాలము పరిపక్వమైన వెంటనే భారతదేశ మధినివేశములతోబాటు సామ్రాజ్య ములో సమాన భాగస్వామిగా నుండవలెనని బ్రిటిష్ ప్రభుత్వమువారి ఉద్దేశమైనట్లు బ్రిటిష్ మంత్రు లనేకమార్లు బహిరంగముగా చాటిరి. కాని ౧౯౧౯ నాటి రాజ్యాంగ ప్రణాళికనమలు జరుపుటయందు బ్రిటిష్‌వారి ఉద్దేశ్యములను గూర్చి వ్యాఖ్యానముచేయుటలో ఇంగ్లాండులోను, ఇండియా లోనుకూడ కొన్ని సందేహములు కలిగినందున ౧౯౧౭నాటి ప్రకటనలో ఉద్దేశింపబడిన భారతరాజ్యాంగ నిర్మాణము యొక్క సహజ పరిణామము అధినివేశ ప్రతిపత్తియేయని స్పష్టముగా ప్రకటించుటకు బ్రిటిష్‌వారి పక్షమున నాకధి కార మీయబడినది" యని ఆప్రకటన యందుకలదు. మరియు పైఆశయములనుగూర్చిన కార్యవిధానమునుచర్చించు టకు ఒక మహాసభ (కాన్ఫరెన్సు) సమావేశ పరుపడునని

ఆసభలో సంస్థానాధీశుల ప్రతినిధులు, బ్రిటిష్ గవర్నమెంటు ప్రతినిధులు, బ్రిటిష్ యిండియా ప్రజల ప్రతినిధులు ఉందురని వైస్రాయిగారి ప్రకటనలో కలదు.

ఈప్రకటనచూచి మితవాదులు ఆనందభరితులైరి. మితవాదులే యననేల, కాంగ్రెసు నాయకులందరు (గాంధీ మహాత్ముడుతప్ప) బోల్తాపడిరి. బ్రిటిష్ ప్రభుత్వమువారి ఉదారబుద్ధి పొగడజొచ్చిరి. గాంధీమహాత్ముడు ప్రకటనలోని అర్థము సందేహాస్పదముగా యున్నదని తలంచి సందేహ నివారణకై ౧౯౨౯ డిశెంబరు ౨౩వ తేదీన వైస్రాయిని చూచెను. సంపూర్ణాధినివేశ ప్రతిపత్తి నాధారముగా చేసుకొనియే, లండను సభయందు చర్చలు జరుగునని విస్పష్టపర్చవలసినదని గాంధీమహాత్ముడు వైస్రాయినికోరెను. పాపము మాటతికమకలతో సంతృప్తి పర్చి పంపదలచిన ఆంగ్లరాజకీయవేత్త కీ సూటిప్రశ్న గండకత్తెరాయెను. ప్రకటనలో తెల్పినదానినిమించి వేరేమియు చెప్పజాలననియు, స్పష్టముగా అధినివేశ ప్రతిపత్తిని వాగ్దానము చేయుచూ, లండనుసభకు (రౌండుటేబిల్ కాన్ఫరెన్సు) ఆహ్వానముల పంపేస్థితిలో తానులేనని ప్రత్యుత్తరమిచ్చెను. సారాంశము అంతా హుళక్కి.

కలకత్తా కాంగ్రెసులో యివ్వబడిన సంవత్సరము గడువు ముగియవచ్చినది. కొద్దిరోజులు మాత్రమే మిగిలెను. ప్రభుత్వమువారి ప్రకటన బూటకమని తేలిపోయినది. భవిష్యత్కార్యక్రమమును నిర్ణయించుకొనుటకు పండిత

జవాహరలాల్ నెహ్రూగారి అధ్యక్షతక్రింద లాహోరులో జాతీయ మహాసభ (౧౯-౨౯) సమావేశమాయెను.

తాను సామ్యవాదిననియు ప్రజాపరిపాలన వాదిననియు రాజులలోను యువరాజులలోను తనకు నమ్మకము లేదనియు ఆయన స్పష్టీకరించెను. స్వాతంత్ర్యమనగా బ్రిటిష్ సామ్రాజ్య తత్వమునుండి, బ్రిటిష్ రాజకీయ నిరంకుశాధికారమునుండి విముక్తిని పొందుటయని నిర్వచించెను. మరియు ఏపేరుతోనై నను ముందు మనమధికారము సంపాదించుట అవసరమనెను. అధికారము హస్తగతమైనదనుటకు గుర్తు మనదేశము నుండి విదేశ సైనికులు పూర్తిగా వెళ్లిపోవుటయే యనెను. లాహోరుకాంగ్రెసునందు సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మాన మంగీకరింపబడెను.

"అధినివేశ ప్రతిపత్తినిగూర్చి అక్టోబరు ౩౧ వ తేదీన చేయబడిన వైస్రాయి ప్రకటనము నుద్దేశించి, రాజకీయ పక్షనాయకులు కాంగ్రెసు వాదులతోసహా సంతకములు చేసి ప్రచురించిన ప్రకటన సందర్భమున వర్కింగ్ కమిటివా రవ లంబించిన చర్యను ఈకాంగ్రెస్ ఆమోదించుచున్నది; స్వరా జ్యోద్యమ పరిష్కారము నిమిత్తము వైస్రాయిచేసిన ప్రయ త్నములను ఈకాంగ్రెస్ శ్లాఘించుచున్నది; కాని తర్వాత జరిగిన కొన్ని విషయములనుబట్టి, మహాత్మగాంధి, పండిత మోతిలాల్ నెహ్రూ మొదలగు నాయకులు వైస్రాయితో మాట్లాడినప్పుడు కలిగిన ఫలితములనుబట్టి రౌండుటేబిల్ మహాసభలో ప్రస్తుతసమయమున పాల్గొనినందువల్ల ప్రయో జనము లేదని ఈకాంగ్రెసు మహాసభ అభిప్రాయపడు

మన్నది. గాన నిరుడు కలకత్తా మహాసభలో అంగీకరింపబడిన తీర్మానప్రకారము కాంగ్రెస్ మహాత్ముడు మరొక పోరాటమునకు సన్నాహ మారంభించెను. గాంధీగారి గట్టితనమును చూచి పలువురు ఆశ్చర్యచకితులైరి. ౧౯-౨౧ లో అసహాయోద్యమమునకు, గాంధి నాయకత్వమునకు మహారాష్ట్రులు విముఖులుగా యుండిరి. మరల యిప్పుడు తమపూర్వపద్ధతినే అనుసరించిరి. శాసనసభా బహిష్కారము తమకు సమ్మతము కాదనియు, రౌండుటేబిల్ సమావేశమునందు పాల్గొనవలెననియుననిరి. మహాత్ముడు తాటాకు చప్పుళ్ళకు ఝడియునా!

జనవరి ౨౬ వ తేదీన యావద్భారత దేశమునందును పట్టణములలోను, పల్లెలలోను బహిరంగసభల గావించి, సంపూర్ణ స్వాతంత్ర్య ప్రకటనను చదువవలసినదని కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమువారు నిర్ణయించిరి. సంపూర్ణ స్వాతంత్ర్యప్రకటనయం దిట్లుగలదు.

"తమకష్టార్జిత ఫలముల ననుభవించి, తమ జీవితావసరములను పొందుటకు ప్రతిజాతికి హక్కున్నట్లుగనే భారత జాతికిగూడ శాశ్వతమైన హక్కుకలదని మావిశ్వాసము. అందుమూలముననే వారి అభివృద్ధికి సంపూర్ణావకాశములు కలుగగలవు. ఏప్రభుత్వమైననూ ప్రజల హక్కులను తృణీకరించి, వారి నణగద్రొక్కుటకు బూనునెడల ప్రజల కాప్రభుత్వమును మార్చుటకుగాని లేక నిర్మూలించుటకుగాని హక్కు కలదనికూడ మావిశ్వాసము. భారతదేశములోని బ్రిటిష్ ప్రభుత్వము భారతప్రజల స్వాతంత్ర్యమును తృణీకరించుటయే

గాక, సామాన్యప్రజల ధనములను దోచుకొనుట పైనకూడ నాధారపడియున్నది. ఆప్రభుత్వ మూలమున భారతదేశముయొక్క మత, రాజకీయ, ఆర్థిక, విజ్ఞానములు నాశనము చేయబడినవి. గాన భారతదేశము బ్రిటిష్ సంబంధమును వదలుకొని పూర్ణ స్వరాజ్యమును పొందవలెనని మా విశ్వాసము.”

“ఆర్థికముగా భారతదేశము నాశనము చేయబడినది. మా దేశప్రజలనుండి తీసుకొనబడే పన్నులు మాప్రజల ఆదాయమున కెంతమాత్రము అనుగుణముగా లేవు. మా సగటాదాయము రోజుకు రు. ౦-౧-౯ (౧౦౪ పైసలు) మేము చెల్లించే భారములో నూటికి ౨౦ వంతున హెచ్చింపబడినభూమి శిస్తులు రైతులు చెల్లించుకొనవలసియున్నది. నూటికి 3 వంతున హెచ్చింపబడిన ఉప్పుపన్ను పేదలకు భరింప శక్యముకాకున్నది.”

“చేతితో నూలువడుకుటవంటి గ్రామ పరిశ్రమలు నిర్మూలింపబడినవి. రైతులు సంవత్సరములో కనీసము ౪ నెలలు తదితరవృత్తులు లేక సోమరులుగా యుండవలసియున్నది. సున్నితములైన చేతిపనులు లేకపోవుట మూలమున వారిబుద్ధి మొద్దుపారినది. ఇతరదేశములలోవలె నిర్మూలింపబడిన చేతిపనులకు బదులుగా ఈదేశములో క్రొత్తవృత్తులు కల్పింపబడలేదు.”

“దిగుమతి పన్నుల మూలకమునను, కరెన్సీ తికమకల మూలమునను రైతులపైన క్రొత్తబరువులు వేయబడినవి.

బ్రిటిష్ దేశములో తయారుచేయబడిన వస్తువులే ఎక్కువగా మాకు దిగుమతియగుచున్నవి. దిగుమతి పన్నులలో ఇంగ్లాండులో తయారు చేయబడిన వస్తువులకు పక్షపాతము చూపబడుచున్నది. అందుమూలముగా వచ్చిన ప్రభుత్వాదాయము ప్రజల పన్నులభారము తగ్గించుటకుగాక ప్రభుత్వము వారి దుబారాఖర్చులకు వినియోగింపబడుచున్నది. మారకపు రేటువిషయములో చేయబడే కృత్రిమము అన్నిటికంటె నిరంకుశముగా యున్నది. అందుమూలమున ఈదేశమునుండి లక్షలకొలది ద్రవ్యము పరదేశములకు ప్రవహిస్తూ వున్నది."

"బ్రిటిష్ పరిపాలనక్రింద పొందినంత అధోగతి రాజకీయముగా ముందెన్నడు భారతదేశము పొందియుండలేదు. సంస్కరణములు ప్రజలకు నిజమైన రాజకీయాధికారము నీయలేదు. మాలోని ఉత్తమోత్తములు విదేశీయుల అధికారమునకు తలలొగ్గవలసియున్నది. అభిప్రాయ ప్రకటనమునకుగాని, సభా సమావేశములకుగాని మాకు స్వాతంత్ర్యము నిరాకరింపబడినది. మాదేశీయులలో అనేకమంది విదేశములయందజ్ఞాతవాసము చేయుచున్నారు. వారు మాతృదేశమునకు రావీలులేకున్నది. మాపరిపాలనా సామర్థ్యము పూర్తిగా నిర్మూలింపబడినది. సామాన్యప్రజలు చిన్నచిన్న గ్రామనౌకరీలతోను గుమాస్తాగిరీలతోను సంతృప్తిపడవలసివచ్చినది."

"నేటి విద్యాపద్ధతి మమ్ములను మావిజ్ఞానమార్గము నుండి పెడమార్గములను పట్టించినది. మాకీయబడు శిక్షణము

మమ్ములను బంధించు గొలుసులనే మేమంటిపట్టుకొని యుండునట్లుచేసినది. నిర్బంధముగా మేము నిరాయుధులుగా జేయబడితిమి. అందుచే మాపౌరుషము నశించినది. మాలోని నిరోధశక్తి నణగద్రొక్కుటకు భయంకరాయుధములతో విదేశసైన్యము దేశములో నిలుపబడినది. మేము స్వసంరక్షణను చేసుకొనగల్గిన పరిస్థితిలో లేము. విదేశ దండయాత్ర విషయములోగాని, లేక దొంగలు, బందిపోటుదారులు మొదలగు దుర్మార్గులనుండి మాగృహములను, కుటుంబములనురక్షించుకొను శక్తిగాని మాకు లేకుండపోయినది."

"ఇటువంటి ఆపత్తులను కలిగించిన పరిపాలనమునకు మాదేశము నింకను గురిచేయుట దేవునకు, మానవునకు కూడ ప్రతికూలముగా అపరాధముచేసినట్లు మేము భావింతుము. కాని మాస్వాతంత్ర్యమును సంపాదించుకొనుటకు ప్రయోజనకరమైన మార్గము దౌర్జన్యపద్ధతికాదని మాకు తెలుసును. మాకు సాధ్యమైనంతవరకు బ్రిటిష్‌పరిపాలనము నుండి పూర్తిగా సంబంధమును వదలుకొని పన్నుల నిరాకరణముతోకూడిన శాసనోల్లంఘనమును ప్రారంభించుటకు మేము సంసిద్ధముకాగలము. మేము ప్రభుత్వమువారికిచేసె మాస్వచ్ఛంద సహాయము నుపసంహరించుకొని, ఎట్టి ఆగ్రహకారణములుకలిగినప్పటికి దౌర్జన్యముచేయక పన్నులు చెల్లించుట ఆపివేసినయెడల ఈ అమానుషప్రభుత్వమంతరించునని మావిశ్వాసము. గాన పూర్ణస్వరాజ్యసంపదనార్థము అప్పుడప్పుడు కాంగ్రెసునుండి పంపబడు ఉత్తర్వులను

శిరసావహించుటకు మేమిందుమూలముగా ప్రమాణము చేయుచున్నాము."

పై స్వాతంత్ర్య ప్రకటన భారతదేశమునందలి దాదాపు అన్ని పట్టణములయందును పల్లెలందును లక్షలకొలది జనులచే జనవరి ౨౬ వ తేదీన స్వీకరింపబడెను. మరల మెల్లమెల్లగా ప్రభుత్వమువారు నిర్బంధవిధానమును ప్రారంభించిరి. గాంధీ మహాత్ముడు ఈతూరి ఉప్పుసత్యాగ్రమము ప్రారంభించ దలచెను.

మార్చి ౧౨ తేది ప్రాతఃకాలమున మహాత్ముడు సబర్మతిఆశ్రమములోని ౭౯ మంది స్వచ్ఛంద సేవకులు వెంటనడువ ౨౦౦ మైళ్ళదూరమునయున్న 'దండి' యను సముద్రతీర గ్రామమునకు కాలినడకను బయలుదేరెను. అడుగడుగునకును, నిల్చియున్న లక్షలకొలదిజనుల జయజయధ్వానములు మిన్నుముట్టుచుండ బయలుచేరిన ఆనాటివిజయయాత్ర చిరస్మరణీయమైనది. ఈయాత్రనుగూర్చి మహాత్ముడు "బ్రిటిష్ ప్రభుత్వమీదేశములోని నైతిక, భౌతిక, వైజ్ఞానిక, ఆధ్యాత్మిక విషయములకు వినాశనము కల్పించినది. ఈప్రభుత్వము పాపభూయిష్టమైనదని నావిశ్వాసము. కాన నేనీప్రభుత్వపద్ధతిని నాశనమొనర్తు" ననెను. మరియు "దేవుడు రాజును రక్షించుగాక అనేపాటను నేనుపాడి ఇతరులచే పాడించితిని. అర్జీలు రాయబారములు రాజీనామాలలో నాకెక్కువనమ్మకముండెను. ఇప్పుడవన్నియు వ్యర్థమైనవి. ప్రభుత్వమును లొంగదీయుటకు సాధనము లవికావని నాకు తెలిసినది. రాజద్రోహము నాకు మతమైనది. మనది దౌర్జన్యరహిత

యుద్ధము. మనమెవరినీ చంపకూడదు. కాని ఈ ప్రభుత్వ మును పాపపంకిలమునుండి తొలగించుట మన ధర్మము” అనెను.

విదేశవస్త్ర విక్రయశాలలవద్దను, కల్లుదుకాణముల వద్దను పికెటింగు చేయుట, ఉప్పుశాసన ముల్లంఘించుట ఈ పోరాటములోని ముఖ్య కార్యక్రమము. ఈ పోరాటము ౯ మాసములు నడిచెను. గాంధీమహాత్ముడు, తదితర నాయకులు సత్యాగ్రహులు మొత్తం సుమారు ౯౦ వేలమంది స్త్రీలు పురుషులు నిర్బంధింపబడిరి. వేలకొలదిమంది తీవ్రలాఠీ దెబ్బలకు గురియై వికలాంగులైరి. వందలకొలది ప్రజలు కాల్చబడిరి. ప్రజల ఆస్తులు దోయించబడెను. ఇండ్లు తగులబెట్టబడెను. ఈ ప్రకారం ౯ మాసములు పోరాటము జరిగెను. ప్రభుత్వములో దడదడ ప్రారంభమాయెను. ప్రజలు ధైర్యోత్సాహములు వీడక, భయభ్రాంతులకు లొంగక తమపనిని సాగించుచునేయుండిరి. తెగినదాక బిగించిన ఎదురు తిరుగవచ్చునను భయము ప్రభుత్వమునకుండెను. ఈ పోరాటమును జయప్రదముగా ముగించనిచో పరువుదక్కదను పట్టుదల కాంగ్రెసుకుండెను. అయినను ఉభయులును గౌరవప్రదమైన సంధికి ప్రయత్నించుచుండిరనుటలో నెట్టి సందేహము లేదు. చివరకు రాజకీయ ఖైదీల నందరినివిడుదల గావించుటకు ప్రభుత్వ మంగీకరించెను. శాసనోల్లంఘనమును నిల్పుదల చేయుటకు కాంగ్రెసు అంగీకరించెను. రాజ్యాంగ తంత్రివిషయములో మున్ముందు రౌండుటేబిల్ సభలో ఉభయులుకలిసి చర్చించుకొనుటకు అంగీకరించిరి. సంధిరాయబార

ములు ప్రారంభము కాకముందే పండిత మోతిలాల్ నెహ్రూగారు (౧౯౩౧ ఫిబ్రవరి) నాడు పరలోకగతులైరి.

౨ వ రౌండుటేబిల్ సభకు ఆహ్వానములు పంపబడెను. బ్రిటిష్ ప్రభుత్వము తన ప్రతినిధులను, భారతప్రజలు తమ ప్రతినిధులను ఎన్నుకొని, అటుల ఎన్నుకొనిన ప్రతినిధుల సమావేశమగుచో న్యాయమగు పద్ధతిని వివాదాంశము పరిష్కారము కావచ్చును. గాని ఈ ఆహ్వానములు పంపిన పద్ధతి వేరు. భారతప్రజలకు తమ ప్రతినిధుల నెన్నుకొను హక్కులేదు. ప్రజలలో సానుభూతిలేని ప్రభుత్వ 'జోహుకుం' సంఘములు కొన్ని దేశములో గలవు. వారెల్లప్పుడును గాంధిగారిని, గాంధీ అసహాయోద్యమమును దూషించుటయే పనిగా పెట్టుకొనియున్నారు. అట్టివారిని ఏరి కోరి ఆహ్వానించిరి. భారత జాతీయ మహాసభపక్షమున గాంధీమహాత్ముడు రెండవ రౌండుటేబిల్ మహాసభకు ప్రతినిధిగా పంపబడెను.

పాఠకులు గమనింపదగిన రెండు ముఖ్యాంశము లిచట గలవు. గాంధీగారిని మెల్లగా భారతదేశమునుంచి సాగనంపి, గాంధీ అనుచరుల అణగద్రొక్కి, దేశములో మరల అసహాయోద్యమము తలఎత్తకుండ త్రొక్కిపెట్టవలెనను కుట్ర భారతప్రభుత్వమునకు గలదు. కాంగ్రెసుకును, ప్రభుత్వమునకును మధ్య సంధి గలుగుటకు బాధ్యుడైన యిర్విన్‌ప్రభువు ఉద్యోగపరిమితి ముగిసినందున ఇంగ్లాండు వెళ్లుటయు, అతని స్థానేవిల్లింగుడన్ ప్రభువు భారతదేశమునకు వైస్రాయిగా వచ్చుటయు ఈ మధ్య కాలములోనే అనగా గాంధీమహాత్ముడు రౌండుటేబిల్ సభకు వెళ్లుటకు ముందే జరిగెను.

ఈ వృద్ధజంబుకము (నూతన రాజప్రతినిధి) మద్రాసునందును, బొంబాయినందును గవర్నరుగా పనిచేసిన కాలమున బ్రాహ్మణ బ్రాహ్మణేతర విభేదములను పురిగొల్పి హిందూ సంఘములోని ఒకరిపై నొకరికి ద్వేషము కల్పించిన మహాశయుడు. అసహాయోద్యమము తలయెత్తకుండ త్రొక్కిపెట్టవలెనని తలంచి గాంధీమహాత్ముడు, ఇంగ్లాండునుంచి రాకముందే, జవాహరలాల్ నెహ్రూ, సుభాషచంద్రబోసు, అబ్దుల్ గఫూర్ ఖానుల నిర్బంధించెను. ఇంగ్లాండునుంచి ఇండియాలో అడుగుపెట్టిన అయిదవరోజుననే, కలిసి మాట్లాడుటకైన అవకాశ మివ్వవలసినదని (గాంధి) ఎంత ప్రార్థించినను (వైస్రాయి) వినక గాంధీమహాత్ముని నిర్బంధించెను.

ఆంగ్లప్రభుత్వమువారు భారతదేశమునం దనుభవించుచున్న అధికారములలో, హక్కులలో ఏ ఒక్కదానిని వదలుకొనుటకు సంసిద్ధులు గాలేరు. ఆ రహస్యమును నోటితో చెప్పుటకు బదులుగా చేతలద్వారా భారతీయులే గ్రహించవలెనని ఆంగ్లేయుల కోరిక. భారతదేశమునందు హిందువులు, మహమ్మదీయులు, శిక్కులు క్రైస్తవులు, తదితర మతస్థులు గలరు.

హిందూ మహమ్మదీయులమధ్య పరస్పర అవిశ్వాసముకలదు. అంగ్లేయులుండుటవలన శాంతి భద్రతలు కలిగియున్నాముగాని లేనిచో ఆఫ్గనుస్థానమువారును, భారతదేశమునందలి మహమ్మదీయులకలిసి, మమ్ములను, మా మతమును నాశనముచేయుదురను భయము హిందువులకును; ఇట్లే, ఆంగ్లేయు లుండుటవలనగాని లేనిచో అధికసంఖ్యాకు

లగు హిందువులు మనలను మన మతమును నాశన మొనర్తు రను భయము మహమ్మదీయులకును కలిగించిరి. ఈ భయము పల్లెలయందు నివసించు సామాన్యప్రజలగు హిందూమహమ్మదీయులమధ్య లేదు. కారణము పాశ్చాత్యవిద్య, పాశ్చాత్య నాగరకత యింకను అంతవరకు ప్రాకలేదు. దీనివలన ఈ భయము దాదాపు ప్రతిశతి ౯౦ మందికి (హెచ్చు ప్రజలు గ్రామవాసులే) ఈ భయము లేదనుట నిశ్చయము. ఈ నిర్ణయము చేయగల్గుటకు ఆధారమేమియని పాఠకులు సంశయించవచ్చును.

అయితే ౧౫౦ సంవత్సరముల పరిపాలనాఫలితముగా తయారైన ప్రతిశతి ౫ వంతునయున్న విద్యావంతుల మధ్య మాత్రమే, ఈ భయము, ద్వేషముగలదు. వీరికి అధికార కాంక్ష తప్ప ప్రజాశ్రేయోభిలాష ఆవంతయు లేదు. ఇట్టి వారిని ఏరికోరి బ్రిటిష్‌ప్రభుత్వమువారు రౌండు టేబిల్ సభకు పిలిపించిరి. భారత దేశ స్వాతంత్ర్యమునకై పోరాడుచున్న కాంగ్రెసుకు అనగా కాంగ్రెసుప్రతినిధియగు గాంధీమహాత్మునికి విరుద్ధముగా నిలువబెట్టిరి. మేము స్వరాజ్యమిచ్చుచో మీరెవరెట్లు పంచుకొందురో పంపకము హిస్సాలు తేల్చుకొని చెప్పిన మేమిత్తుమను మాటను బ్రిటిష్‌వారు తేల్చిరి. హిందువులు అధికసంఖ్యాకులగుట మాకు అన్యాయము జరుగవచ్చును గాన ప్రజాప్రతినిధిసభలో హెచ్చు స్థానములు గావలెనని మహమ్మదీయులు పట్టుబట్టిరి. మా మాటేమని శిక్కులనిరి. మమ్ముల మరుతురేమో జాగ్రతసుమా! యని క్రైస్తవులనిరి. ఈ పంపకము ఎవరితో ఎవరు తేల్చవలెను.

ఈ ప్రకారం మాట్లాడువారు స్వసంఘాభిమానులు, స్వసంఘాభివృద్ధిని చూచుకొనువారేగాని, భారత శ్రేయస్సుతో పనిలేదను స్వార్థపరులు. మహాత్ముడు సమాధానపరుప ఎంతయో ప్రయత్నించెను. మధ్య చేరినవారు సమాధానపడనిత్తురా? సమాధానపడిన వారికి నష్టముకదా! ఈ కుతంత్రిమును మహాత్ముడు గ్రహించెను. ఇయ్యది గృహకృత్యము. మా యింటి తగాదాలను మేము మాయింటిలో (యిండియాలో) పరిష్కరించుకొందుము. మీకిచ్చినదేమో తెల్పుడనెను. ఆటకట్టెను-దయచేయుమనిరి. గాంధీమహాత్ముడు యింటిదారిపట్టెను. తేలిన సారాంశమేమన కాలవ్యవధికి సాగించిన తంతుగాని సదుద్దేశ్యముతో గావించిన సమావేశము కాదనుట తెలుసుకొనవలసిన ముఖ్యవిషయము.

రౌండుటేబిల్ సభ భగ్నమైనది. మహాత్ముడు యిండియాలో అడుగుపెట్టునప్పటికే ముఖ్య నాయకుల నిర్బంధము జరిగెను. సంధికాలములోనే తిరిగి అవసరము వచ్చునని వేలకొలది లాఠీలను ప్రభుత్వమువారు సిద్ధపర్చిరి. క్రొత్త క్రొత్త నిర్బంధశాసనములు గావించిరి. కావలసిన సమరసన్నాహములు గావించిరి. మహాత్ముడు ౧౯౩౧ డిశెంబరు ౨౮ తేదీన బొంబాయి చేరెను. ౧౯౩౨ జనవరి ౪ వ తేదీన గాంధీమహాత్ముని నిర్బంధించిరి. తిరిగి సత్యాగ్రహము ప్రారంభమాయెను. ప్రభుత్వము తీవ్ర నిర్బంధములు, లాఠీదెబ్బలు ఆస్తుల జప్తులు, నిరివిగా గావించిరి. కాంగ్రెసు సంస్థలు అక్రమసంస్థలుగా ప్రకటింపబడెను. కాంగ్రెసువార్తలు ప్రకటింపబడకుండ పత్రికలవారిని నిర్బంధించిరి. రహస్య

సంఘములు వెలిసెను. ప్రభుత్వముతో పోటీచేసెను. ఎక్కడ చూచిన కాంగ్రెసు సభలే. ఎక్కడచూచిన కాంగ్రెసు కర పత్రములే. ప్రభుత్వము తనరహస్యపరిశోధకసంఘముచే నెంత కృషిచేసినను, కరపత్రము అచ్చులగు స్థలములగాని ప్రకటన కర్తలనుగాని తెలుసుకొనజాలకపోయెను. ఇంత తీవ్రనిర్బంధ మును సాగించినను కాంగ్రెసు వ్యవహారములు నడుచుటకు తగిన ధనము, మనుష్యులు లభించుచునేయుండిరి.

ఈ కథ యిట్లుండ, అక్కడ పార్లమెంటు నూతన సంస్కరణ చట్టము నొకదానిని పార్లమెంటు వారి అమోదపై యిండియాలో ప్రవేశపెట్టుటకు తయారు చేసిరి. సాంఘికసమస్యా పరిష్కారము కానందున బ్రిటిష్ ప్రధానమంత్రి రామ్సే మేక్డోనాల్డుగారు మధ్యవర్తి పరిష్కా రమునకు బూని తీర్పుచేసెను. ఆ తీర్పుప్రకారం అస్పృశ్యులు ప్రత్యేకసంఘముగా గణింపబడిరి.

అస్పృశ్యులు ప్రత్యేకసంఘము కాదనియు వారు హిందువులే అగుట, 'అస్పృశ్యత' యను కళంకమును కడిగి వేసి హిందువులుగనే పరిగణింపబడవలెనని గాంధీమహాత్ముని ఆశయము. ప్రత్యేకసంఘముగా నిర్ణయించి, ప్రత్యేకస్థానము ప్రత్యేక ఎన్నికలు ఏర్పర్చుటమూలమున 'అస్పృశ్యులు'అను ప్రత్యేకవర్గ మేర్పడిపోవుననియు మహాత్ముని భయము. తద్వారా బ్రిటిష్ ప్రధాని అస్పృశ్యులను ప్రత్యేకవర్గముగా చేసి హిందూమతమును శాశ్వతకళంక మాపాదింపతలచెనని మహాత్ముడు తలంచెను.

యరవాడ జైలునుండి, యిండియా కార్యదర్శితోడను, బ్రిటిష్ ప్రధానితోడను ఉత్తరప్రత్యుత్తరముల జరిపెను. ప్రధాని నిర్ణయము హిందూమతమునకు తీరని కళంకమనియు దీనిని రద్దుచేయునిదే నిరాహారదీక్ష బూని ప్రాయోపదేశదీక్ష వహింతుననియు శపథము బూనెను. బ్రిటిష్‌వారు అంగీకరించ లేదు.

మహాత్ముడు ౧౯౩౨ సెప్టెంబరు ౨౦ తేదీన యరవాడ జైలునందు అస్పృశ్యులనబడు హరిజనులకు గల్గిన అన్యాయమును తొలగించుటకై నిరాహారదీక్ష ప్రారంభించెను. మహాత్ముని నిరసన వ్రతము ఆసేతు హిమాచల పర్యంతము కదిలించివేసెను. నాయకులందరు పూనాయందు సమావేశమై గాంధీమహాత్ముని కోరికప్రకారం అస్పృశ్యులు ప్రత్యేకవర్గమను పద్ధతిని రద్దుచేసిరి. దీనినే పూనాప్యాక్టు అందురు. ఈ ప్యాక్టును ప్రధాన మంత్రిచే అంగీకరింపచేయు నప్పటికి వారం రోజులు పట్టెను.

౧౯౩౩ మే ౮వ తేదీన హరిజనోద్యమము తీవ్రముగా సాగుటకును, హరిజనోద్యప్రచారకులు నిష్కలంకహృదయముతో పనిచేయుట లేదని తలంచియు, మహాత్ముడు ౨౧ దినములు ఉపవాసవ్రతము ప్రారంభించెను. ఉపవాసవ్రతము ప్రారంభించిన మొదటిదినముననే మహాత్ముని చెరసాలనుండి విడుదలచేసిరి. పూనాయందలి 'ఠాకర్సే' దొరసానిగారి పర్ణకుటీరములో బసచేసెను. విడుదలపొందిన వెంటనే, సత్యాగ్రహము ౬ వారముల కాలము నిలుపవలసినదని కాంగ్రెసు వారిని, ఖైదీలను విడుదల గావించుట మంచిదని ప్రభుత్వము

వారిని కోరెను. ఉద్యమమున రహస్యపద్ధతి ప్రవేశపెట్టుటను నిరసించెను. ఉపవాసవ్రతము జయప్రదముగా ముగిసెను. ఉపవాసానంతరము నాయకుల సమావేశము జరిగి శాసనోల్లంఘనము పూర్తిగా నిల్పివేయబడెను. గాని వ్యక్తి శాసనోల్లంఘనము గావించుటకు నిశ్చయింపబడెను. గాంధీగారిని మరల అరెస్టుగావించి ౧ సంవత్సర శిక్ష విధించి యరవాడ జైలుకు తిరిగి చేర్చిరి.

పూనాప్యాక్టు జరిగిన కాలమునందు హరిజనప్రచారమును జైలునుండి సాగించుకొనుటకు ప్రభుత్వమువారు అనుమతించియుండిరి. ఇప్పుడా అవకాశము తొలగించుటచే మహాత్ముడు మరల ఉపవాసవ్రతము ప్రారంభించెను. ౫ వ రోజున ప్రాణాపాయస్థితి కలుగగా విడుదలగావించిరి. ౧ సంవత్సర కాలము రాజకీయములయందు జోక్యము కల్గించుకొనక కేవలము హరిజనోద్యమమునకై పనిచేయుదునని నిశ్చయించుకొని హరిజనోద్యమ ప్రచారమునకై ఆసేతు హిమాచల పర్యంతము సంచారము ప్రారంభించెను. హరిజన యాత్రతో ౧౯౩౪ ముగిసెను.

౧౯౨౨ లో శాసనోల్లంఘనము విరమింపబడిన వెంటనే శాసనసభా కార్యక్రమమువచ్చెను. తిరిగి ౧౯౩౩ లో శాసనోల్లంఘనము విరమింపగనే, మరొకమారు శాసనసభాప్రవేశ కోరిక లుదయించెను. మొదటి తూరివలెనే, తన అసమ్మతిని వెలిబుచ్చుచూ, వెళ్ళదలచినవారికి తన అభ్యంతరము లేదనియు, తన శక్తికొలది తోడ్పడుదుననియు

మహాత్ముడు వాగ్దానము చేసెను. మొదటిసారి స్వరాజ్య పక్షము ఏర్పడియుండెను. ఈ తూరి పార్లమెంటరీ బోర్డు నొకదానిని సృష్టించిరి. ఆనాడు శాసనసభా కార్యక్రమము నడిపినవారు చిత్తరంజనదాస్, మోతిలాల్ నెహ్రూ గార్లు. ఈతూరి డాక్టరు అన్సారి మదనమోహన మాలవ్యాలు ముఖ్యులు.

గాంధీమహాత్ముడు ౧౯౨౦ సంవత్సరమునుంచి కాంగ్రెసు రథసారథియై నడిపించెను. గాని యువకులకు ఇతని శ్రోత్రియపద్ధతులు నచ్చలేదు. సత్యము; అహింస; ఖాద్దము; అస్పృశ్యతా నివారణ మొదలగువాటియందు విశ్వాసము లేకుండెను. సుఖమనునది లేక (అనగా హాయిగా శాసన సభలో చక్కని ఉపన్యాసములతో కాలక్షేపము చేయకుండ) ఎల్లప్పుడు అడవులబట్టి (సత్యాగ్రహము; జైలు) తిరుగుటతో విసుగెత్తిపోయిరి. అటు వృద్ధులు, ఇటు యువకులు మహాత్మునితో ఎదురుతిరిగి పోరాడ శక్తిజాలకయుండి, బలవంత ప్రాణాయామమువలె అనుసరించుచుండిరి. ఈ రహస్యమును మహాత్ముడు గ్రహించి ౧౯౩౪ లో కాంగ్రెసును వదిలివేసెను. ఖాదీయందు విశ్వాసము లేకపోవుట; శాసన సభా కార్యక్రమమును నిర్వహించుటకు పార్లమెంటరీ బోర్డు నియామక సందర్భమున పొడసూపిన అభిప్రాయభేదములు; సామ్యవాదుల కార్యవిధానముపై అసమ్మతి; సంస్థాన వ్యవహారములలో జోక్యము కలిగించుకొనుట; కాంగ్రెసు నాయకులలో అహింసయందు పూర్తి విశ్వాసము లేకపోవుట; మొదలగునవి కాంగ్రెసును వదలుటకు కారణములని

మహాత్ముడు ప్రకటించెను. గాని అన్ని విషయములయందును, శంఖములో పోసినగాని తీర్థముగానట్లు, గాంధీగారి సలహా, సహకారము లేకుండ కాంగ్రెసు ఏ వ్యవవహారమును చేయుటలేదు.

౧౯౨౧ లో సత్యాగ్రహము, పన్నుల నిరాకరణము ఆరంభించబడి, చౌరి చౌరాహత్యలవలన అప్పటికా ఉద్యమము ఆగిపోయెను. ఆ పర్యాయము దాదాపు 30 వేల మంది ఉద్యమములో పాల్గొని కారాగారవాస శిక్ష ననుభవించిరి. గాంధిమహాత్ముని నిర్బంధముతో ప్రజలు భీతిల్లిరి. చిత్తరంజనదాసు, మోతీలాల్ నెహ్రూ గార్ల శాసనసభా కార్యక్రమము ప్రజాసామాన్యమునకు ఉత్సాహకరముగా లేకుండెను. తిరిగి ౧౯30 లో గాంధీమహాత్ముడు ఉప్పు సత్యాగ్రహము గావించెను. దాదాపు ఒక లక్షమంది సత్యాగ్రహములో పాల్గొనిరి. ప్రభుత్వము లాఠీచార్జీలు, కాల్పులు ప్రజల భీతావహుల గావించెను. ఈ సమరము ౧౯3౪ లో ఆగిపోయెను. ౧౯౨౧ లో ౧౯30 లో ప్రజాసామాన్యములో గల ఉత్సాహోద్రేకములను ప్రభుత్వము తీవ్ర నిర్బంధములద్వారా అణచివేయగలిగెనేగాని నిర్మూలించజాలకపోయెననుటను ౧౯3౭ లో జరిగిన రాష్ట్రీయ ఎన్నికలు ఋజువుచేసెను.

రాజకీయ వ్యవహారములలో పాల్గొనగూడదు, రాజ్యస్థాపనకు ప్రయత్నింపగూడదు, కేవలము వర్తకముమాత్రమే చేసుకొనవలెనను షర్తులతో జహంగీరు చక్రవర్తి వర్తకము చేసుకొనుటకు ఈ ఆంగ్లేయులకు అనుమతించిన విషయము

మొదటిప్రకరణములో చదివియున్నారు. అయినను ఎన్నియో ద్రోహకృత్యములు గావించి క్రమక్రమముగా రాజ్యస్థాపనచేసిరి. ఆర్థిక, సాంఘిక కట్టుబాట్లను సర్వనాశన మొనర్చిరి. రాజకీయముగా నిరాయుధుల గావించి జాతిని నిర్వీర్య మొనర్చిరి. ఇంతచేసియు చివరకు ఆంగ్లేయులు భారతీయులకు చెప్పినదేమన, భారతీయులు అబోరిజనులు, అనాగరికులు, అడివి జాతివారనియు, నాగరకతయన నసలే నెరుంగరనియు, అట్టి ఈ నల్లజాతిని (భారతీయుల) రక్షించు నిమిత్తము ఆ భగవంతుడు తమ (ఆంగ్లేయుల)పై రక్షణ భారము వేసెననియు స్వర్గతుల్యమగు (అచ్చట బొగ్గు, యినుముతప్ప తినుటకుకూడ లేదని మనకు తెలియునట్లు) తమ బ్రిటిష్ దేశము వదిలి ౬ వేల మైళ్ళు దూరముననున్న ఉష్ణదేశమగు భారత దేశమునకు వచ్చుట భగవదాదేశమును నెరవేర్చుటకే యనియు స్వార్థమావంతకూడ లేదనియు కల్లిబొల్లిమాటలు చెప్పి మనలను మోసముచేయుచున్నారు. నమ్మువారు లేకపోయినను ఇప్పటికిని యిదే ధోరణిలో మాట్లాడుదురు. ౬౦౦ సంవత్సరములు రాజ్యమేలిన మొగలులకాలములో లేని హిందూమహమ్మదీయ విభేదములు, బ్రాహ్మణ బ్రాహ్మణేతర తగాదాలు, ఇప్పుడేర్పడినవి. ఈ ఆంగ్లప్రభుత్వము మనలను బడిలో చదువుకొను పిల్లలవంటి వారమని చెప్పుచున్నది. మనకుగల స్వరాజ్యార్హతను పరీక్షించి, ఫలితము బట్టి కొద్దికొద్దిగా స్వరాజ్యమిత్తురట. కాంగ్రెసు ౧౮౮౫ మొదలు ౧౯౧౫ వరకు ౩౦ సంవత్సరముల కృషిఫలితముగా భారతీయులకు ఉన్నతోద్యోగములు కొన్ని లభించెను. గాని

భారతీయులు కోరినది ఉద్యోగములు కావు. ౧౯౧౯ లో మాంటుఫర్డు సంస్కరణములను పేర కొన్ని సంస్కరణములు ప్రసాదింపబడి ౧౯౨౦ లో అమలుకు వచ్చెను. ఆ సంస్కరణములు ౧౦ సంవత్సరములు అమలులో నుండుననియు, భారతీయు లా సంస్కరణములను జయప్రదముగా నిర్వహించగల్గినచో ౧౦ సంవత్సరముల తరువాత మరికొన్ని సంస్కరణల నిత్తుమనిరి. సంస్కరణలు అసంతృప్తికరములని భారతీయులందరు నిషేధించిరి. గాని ప్రభుత్వమువారు, తమ్మాశ్రయించి బ్రతుకువారిని కొందరిని చేరదీసి వారిద్వారా ఈ సంస్కరణముల నడపించిరి. ఈ సంస్కరణల ఫలితముగా మతద్వేషము, కులకక్షలు, పరస్పర ఈర్ష్యా అసూయలు పెచ్చుపెరిగినవి. ౧౯౨౯ సంవత్సరముతో ౧౦ సంవత్సరముల గడువు ముగియుచుండుటచే మరల అర్హతానర్హతలను పరిష్కరించుటకు ౧౯౨౭ లో ఒక విచారణసంఘమును నియమించిరి. విచారణ సంఘముయొక్క విచారణ ఫలితముగా ౧౯౩౫ రాజ్యాంగ చట్టము పుట్టెను.

ప్రజాసౌకర్యముల సమకూర్చు నిమిత్తము అనగా విద్య, వైద్యము, న్యాయము కొరకు ప్రభుత్వము ప్రజలవద్ద పన్నుల వసూలుచేయుచున్నది. పన్నులు చెల్లించువాడు రైతు, గ్రామవాసి. వందలు వేలు జీతముల పొందు ప్రభుత్వోద్యోగులు పట్టణవాసులు. వీరివద్ద పన్నులువసూలుచేయబడవు. పన్నులిచ్చు రైతుల కుపయుక్తమగు పాఠశాలలుగాని, వారి రోగముల నివారించుటకు వైద్యశాలలుగాని, వారిలో కలుగు తగాదాలు పరిష్కరించుటకు పంచాయితీ

సంఘములుగాని లేవు. పన్నులివ్వని ప్రభుత్వోద్యోగులు నివసించు పట్టణములలోనివారికి ఈ సౌకర్యములన్నియు గలవు. పల్లెలు పాడుపడుచున్నవి. పట్టణములు పాపము పెరిగినట్లు పెరుగుచున్నవి. ఇట్టి వ్యత్యాసమునకుగల కారణము ఆంగ్ల ప్రభుత్వ పరిపాలనావిధానమందలి లోపమే.

ఇట్టి లోపమును సవరించుటకై ౫౦ సంవత్సరముల నుంచి కాంగ్రెసు కృషిచేయుచున్నది. మనము సు (మంచి పరిపాలనము) పరిపాలన కోరితిమి. వారు స్వపరిపాలన ప్రసాదింతుమని ఆశ కల్పించిరి. మనము స్వపరిపాలన కావలెనని ప్రాకులాడితిమి. వారు బాధ్యతాయుత (జిమ్మేదారి ప్రభుత్వవిధానము) పరిపాలనా విధాన మేర్పాటుచేతుమనిరి. మనము బాధ్యతాయుత పరిపాలనకై ఆందోళన చేసితిమి. వారు అధినివేశ ప్రతిపత్తి (డొమినియన్ స్టేటస్) కాలక్రమమున యిత్తుమనిరి. అధినివేశ ప్రతిపత్తికై పోరాడితిమి. చివరకు వారు సమాఖ్య (ఫెడరల్ ప్రభుత్వము) నెలకొల్పుదుమని ౧౯౩౫ రాజ్యాంగ చట్టమును గావించిరి.

రాష్ట్రప్రభుత్వములని, కేంద్రప్రభుత్వమని రెండు భాగములు. విద్య, వైద్యములకు సంబంధించినట్టియు,పన్నులు వసూలుచేయుట ఖర్చుపెట్టుట మొదలగునవి రాష్ట్రప్రభుత్వములకుసంబంధించిన పనులు-రైల్వేలు, సైన్యములు, తపాలశాఖ విదేశములతో సంబంధ బాంధవ్యముల నేర్పరచుకొనుట మొదలగునవి కేంద్రప్రభుత్వము నిర్వహించవలసినవి. మరియు రాష్ట్రము మధ్య లేక రాష్ట్రము సంస్థానము మధ్య కలుగు తగాదాలు పరిష్కరించుటకూడ కేంద్రప్రభుత్వము

నకు సంబంధించినవే. రాష్ట్రశాసనసభలు, కేంద్రశాసనసభ యుండును. జిల్లాల ప్రజలు రాష్ట్ర శాసనసభలకు ప్రతినిధుల నెన్నుకొనెదరు. ఈ ప్రకారం ఎన్నుకొనబడిన ప్రజాప్రతినిధులలో నుండి మంత్రులు నియమింపబడుదురు. మంత్రులు పరిపాలనా భారము వహించి ప్రభుత్వము నడుపుదురు.

ఇక, భారత శాసనసభ (కేంద్రసభకు) రాష్ట్రశాసనసభలు తమ తమ రాష్ట్రములనుంచి నియమిత సంఖ్యను బట్టి ప్రతినిధుల నంపుదురు. ప్రభుత్వము కొందరి నియమించును. ఈ ప్రకారం ఏర్పడిన సభ్యులు మంత్రుల నెన్నుకొనెదరు. ఈ మంత్రులచే భారతదేశ పరిపాలన నడిపించబడును. దీనినే ఫెడరల్ (సమాఖ్య) ప్రభుత్వమందురు.

ఈ ఫెడరల్ విధానము సరియగు పద్ధతిని అమలు చేయుచో భారతప్రజలకు లాభదాయకమే. ఇయ్యది కుత్సిత బుద్ధితో తయారుచేయబడినది. సంస్థానాధీశులు సార్వభౌమ ప్రభుత్వమునకు లోబడినవారు. అట్టి సంస్థానాధీశుల ప్రతినిధులు ఆ సార్వభౌమ ప్రభుత్వముయొక్క ఆజ్ఞానువర్తులై యుందురు. ప్రజాప్రతినిధులతో కలిసి ప్రజల యోగక్షేమములకు పాటుపడక, ఆంగ్లేయుల లాభముకే పనిచేయవలసినవారైయుందురు. అందుచే, సంస్థానాధీశుల ప్రతినిధు లుండకూడదనియు సంస్థాన ప్రజల ప్రతినిధులుండవలెననియు కాంగ్రెసు కోరినది.

నూతన రాజ్యాంగ ప్రణాళిక ప్రకారము రాష్ట్ర శాసనసభలకు ఎన్నికలు జరిగెను. ౧౧ రాష్ట్రములలో ౮ రాష్ట్రములయందు ప్రజలు కాంగ్రెసువారిని ప్రతినిధులుగా

నెన్నుకొని, కాంగ్రెసుకుగల పలుకుబడిని, కాంగ్రెసుయం దభిమానమును ఋజువుచేసిరి. తద్వారా ౮ రాష్ట్రములలో కాంగ్రెసు పరిపాలన ఏర్పడెను. కాంగ్రెసుకుగల పలుకుబడిని గాంచి ఆంగ్లేయులు గాభరాపడిరి. బ్రిటిష్ ప్రభుత్వము దద్దరిల్లెను. అందుచే, కేంద్రప్రభుత్వపు ఎన్నికలు గావించిన కాంగ్రెసువా రధికసంఖ్యాకులుగా నెన్నుకొనబడుదురను భయంతో కేంద్ర శాసనసభా ఎన్నికలను నాటినుంచి నేటివరకు జరుపలేదు. ప్రాతసభ్యులతోనే పని దాటవేసుకొనుచున్నారు.

క్రమముగా కాంగ్రెసు పలుకుబడి పెరుగుచుండెను. కాంగ్రెసువారు ప్రభుత్వములోని లోపములను సవరించ మొదలిడిరి. మద్యపాన నిషేధము ఒక జిల్లా తరువాత నొక జిల్లా వంతున అమలుచేయ సాగిరి. పన్నుల భారము కొంత తగ్గించబడెను. ౧౫ సంవత్సరముల కృషిఫలితముగా లభించిన ప్రజాధికారమునకు ప్రజలు సంతుష్టిపొందిరి. గాని ౧౫౦ సంవత్సరముల ఆంగ్ల పరిపాలనా ఫలితముగా గలిగిన దరిద్రతను నిర్మూలించుటకు సహనమును వహించవలసివచ్చెను.

ఇంతలో, యూరఫ్ ఖండమునందు (౧౯౩౯ సెప్టెంబరు ౧ వ తేదిన) యుద్ధమారంభమాయెను. జర్మని పోలెండు రాజ్యముపైకి యుద్ధమునకు దిగగా పోలెండు పక్షమున యుద్ధమునకు దిగి జర్మనీని ఎదిర్చెదమని బ్రిటిష్ప్రభుత్వము ప్రకటించెను. ఈ ప్రకటనద్వారా భారతదేశమునుకూడ యుద్ధములో చేర్చిరి.

జర్మని ప్రభుత్వము యిండియాపైకి దండెత్తివచ్చుట లేదు. పోలెండు రక్షింపబడినను, భక్షింపబడినను, భారతదేశ

మునకు లాభనష్టములు లేవు. అట్టియెడ, భారతీయులను సం ప్రతించకుండ, భారతదేశమును యుద్ధములో చేర్చుట భార తీయుల అవమానించుటయని కాంగ్రెసు తలంచెను. ఆంగ్లే యులు ప్రసాదించిన స్వాతంత్ర్యము నేతిబీరకాయ యని తేలెను. కాంగ్రెసు మంత్రులు ౧౯౩౯ అక్టోబరులో మంత్రి పదవులకు రాజీనామాల నిచ్చిరి.

యుద్ధము ప్రారంభము కాగానే వైస్రాయి గాంధి మహాత్ముని పిలిపించి మాట్లాడెను. ఆంగ్లేయులకు యుద్ధములో తోడ్పడకోరెను. గాంధీమహాత్ముడు సమ్మతించెను. గాని కాంగ్రెసు సమ్మతింపలేదు. ప్రజాసంస్థలతో కూడిన ప్రజా పరిపాలనావిధానమునకు నాశనకారకమై, నిరంకుశ నియంతల పరిపాలనకు లోబడవలసివచ్చుననియు, అతిప్రయాసతో పెం పొందించిన నాగరకత నిర్మూలమగుననియు అందుచే యుద్ధ మునకు దిగితిమని చెప్పు ఆంగ్లప్రభుత్వము 33 కోట్ల భార తీయులను దాస్యములో నుంచుట న్యాయము కాదనియు, యుద్ధానంతరము, భారతస్వాతంత్ర్యము ప్రసాదింపబడునని వాగ్దానము చేసి, వాగ్దాన నిజాయితీకి నిదర్శనము కేంద్ర ప్రభుత్వమును భారతీయుల వశమొనర్చవలెననియు యిందుల కంగీకరించుచో యుద్ధములోతోడ్పడుదుమనియు కాంగ్రెసువా రనిరి.

ఏ పోలెండు రక్షణకై యుద్ధమునకు ఆంగ్లేయులును ఫ్రాన్సువారును దిగిరో, ఆ పోలెండు పక్షమురోజులలో జర్మని వారి వశమాయెను. అంతటితో నాగక నార్వే, డెన్మార్కు, హాలెండు, బెల్జియము ఈ ప్రకారం చిన్నచిన్న రాజ్యము

అంగీకరించుటకు మాత్రము ఒప్పుట లేదు. అంతటితో నాగిన కొంతమేలే. యుద్ధప్రతికూల ప్రచారము శిక్షార్హమగునని శాసనముగావించి, ఆ శాసనముక్రింద కాంగ్రెసువాదుల ఒకరివెంట నొకరిని నిర్బంధముల పాలుగావించ మొదలిడెను. ఆపత్తులో చిక్కుకొనిన ఆంగ్లప్రభుత్వమును చికాకుపర్చుట న్యాయముకాదని ప్రత్యక్షచర్యకు పూనుకొనకుండ కాంగ్రెసును ఆరికట్టిన గాంధీమహాత్ముని మహత్తరాశయమును తెలుసుకొనజాలక, ప్రత్యక్షచర్యకు గడంగకపోవుటకు దుర్బలమే కారణమని తలంచి కాంగ్రెసును చులకనగా చూచుచూ చివరకూ ఇండియామంత్రి బెదిరించుటకుకూడ వెనుదీయ లేదు.

౧౯౪౦ సెప్టెంబరు ౧౫ వ తేదీన బొంబాయినందు సమావేశమైన అఖిలభారత కాంగ్రెసు సంఘమువారు ఈ క్రింది తీర్మానము గావించిరి.

కాంగ్రెసువారు, భారత స్వాతంత్ర్య సంపాదనయే తమ ఆదర్శమని తలంచి, గాంధీమహాత్మునికి ఆతని అహింసాతత్వమునకు తిలోదకములిచ్చి ఆయుధములు చేపట్టి యుద్ధములోతోడ్పడుదుమనియు, కేంద్రమునందు వెంటనేజాతీయ ప్రభుత్వమును నేర్పర్చ నంగీకరించవలసిన దనియు తీర్మానమును గావించిరి. దీనినే పూనా తీర్మానమందురు. ప్రపంచములో శాంతి సౌఖ్యములు సమకూరవలెననిన దౌర్జన్య విధాన మంతమొందవలెననియు, ప్రేమ, సుహృద్భావములతో కూడిన అహింసా పద్ధతిని సత్యాగ్రహ సమరము గావించి న్యాయమగుహక్కులను వ్యక్తులుగాని సంఘములుగాని రాజ్యములుగాని పరస్పరము పొందవచ్చునను నూతన

సిద్ధాంతమునకై తన జీవితమునంతయు ధారపోసి, నూతన పరిశోధనకు కాంగ్రెసును క్షేత్రముగా పెట్టుకొని పనిచేసిన గాంధీమహాత్మునికీ తీర్మానము అశనిఘాతమాయెను.

అయితే, వ్రతముచెడినదిగాని ఫలముమాత్రములభించలేదు. ప్రభుత్వమువారు కాంగ్రెసు పూనా తీర్మానమునకు సమ్మతిచూపలేదు, పైగా, మహాత్ముడులేని కాంగ్రెసును త్రొక్కిపెట్టుట అతిసులభమని ప్రభుత్వము తలంచెను. వెంటనే కాంగ్రెసువారు తమతప్పిదమును గ్రహించిరి. ప్రభుత్వముతో పోరాటము అనివార్యమాయెను. ఆయుధ తిరుగుబాటుకై భారతప్రజ అంగీకరించదు. గాంధీమహాత్ముడులేని సత్యాగ్రహము ఊహించుటకే వీలులేనిది. అందుచే కాంగ్రెసువారు పూనాతీర్మానమును ఉపసంహరించుకొనుట కంగీకరించి గాంధీ నాయకత్వమును అర్థించెను.

బొంబాయినందు ౧౯౪౦ సెప్టెంబరు ౧౫వ తేదీన కాంగ్రెసు స్థాయిసంఘ సమావేశము జరిగెను. గాంధీమహాత్ముడు నాయకత్వము వహించెను-ముప్పది మూడుకోట్ల భారతీయులకు సంబంధించిన విషయమునుగూర్చి భారత ప్రజలతోగాని, ప్రజానాయకులతోగాని, సంప్రతించకుండా, భారతదేశమును యుద్ధములోచేర్చుటకంగీకరించిన వైస్రాయి సాహసము సహించజాలని విషయమనెను. యుద్ధమునకు అర్థబలమును, అంగబలమునుకోరుటకు వైస్రాయికి స్వాతంత్ర్యమున్నట్లే, యుద్ధములోచేరుటకు చేరకుండుటకు సలహాచెప్ప స్వాతంత్ర్యము ప్రజాసంస్థకుండవలెననెను. స్వాతంత్రములో వాక్స్వాతంత్రము, ప్రకటన స్వాతంత్ర్యము ప్రాతి

పదికయనియు, యియ్యదేసాధించజాలని భారతజాతి స్వాతంత్ర్యము పొందుటకు అనర్హమైనదనియు నుడివెను. గాన వాక్ స్వాతంత్ర్యమునకై వైస్రాయితో మాట్లాడుదుననియు, కాంగ్రెసు తన భావములను ప్రకటించుటకును, ప్రచారమొనర్చుటకును వైస్రాయి అంగీకరించుచో అనంతర కర్తవ్యమును నిర్ణయింతునని గంభీరముగా పల్కెను.

బొంబాయి తీర్మానమును స్థాయి సంఘమువారు ఏకగ్రీవముగా నంగీకరించి గాంధీమహాత్ముని సర్వ సేనాధిపతిగా, నియంతగా యెన్నుకొని వారియందు గల భక్తి విశ్వాసములను ప్రకటించిరి.

మహాత్ముడు వైస్రాయితో సంప్రతించెను. వాక్స్వాతంత్ర్యము నంగీకరించజాలమని వైస్రాయి నిర్మోగమాటముగా చెప్పివేసెను. సత్యాగ్రహసమర శంఖారావమొనర్చి దౌర్జన్యరహిత సత్యాగ్రహ సమరమును వెంటనే ప్రారంభించునని భారతప్రజలు తలంచి సర్వసన్నిద్ధులగుచుండ, వ్యక్తి సత్యాగ్రహముమాత్రమే ప్రారంభింతుమనియు, సత్యాగ్రహుల అర్హతానర్హతలు తామే నిర్ణయించి తమచే నిర్ణయింపబడినవారు మాత్రమే సత్యాగ్రహ మొనర్చవలసియుండునని మహాత్ముడు ప్రకటించి సత్యాగ్రహయోధుల ఉత్సాహోద్రేకముల కానకట్టకట్టెను.

వైస్రాయితో సంప్రతించివచ్చిన తరువాత వార్ధాయందు వర్కింగుకమిటి సమావేశము జరిగెను. వైస్రాయి సంప్రతింపు వివరములను వెలిబుచ్చి భావి కార్యక్రమవిధానమును కమిటివారికి తెలియజేసెను. సత్య అహింసలయందు

సంపూర్ణ విశ్వాసము కలిగి, ప్రతినిత్యము రాట్నము వడుకు చుండువారిని మాత్రమే సత్యాగ్రహమొనర్చుట కనుమ తింతుననియు, అట్టివారిలో వినోబా భావే ఒకరనియు వారిని ప్రథమ సత్యాగ్రహిగా నియమించుచున్నానని కమిటీవారికి తెల్పెను. సభ్యులు ఆశ్చర్యచకితులైరి. ఒకరిద్దరు సభ్యులు మండిపడిరనికూడ తెలియవచ్చెను. ముప్పది మూడు కోట్ల భారతీయుల దాస్యవిముక్తి అనామధేయుడగు ఆ ఒక్క వినోబాభావే సత్యాగ్రహమువలన కలుగునాయనియు, సంశ యించుట సహజమేగాని మహాత్ముల చర్య మహాత్ములకే యెరుక. వారి విశ్వాసమెట్టిదో.

రెండు మూడు చోట్ల ఉపన్యసించినపిమ్మట మూడవ రోజున వినోభాభావేను ప్రభుత్వమువారు నిర్బంధించి మూడు మాసముల శిక్ష విధించి కారాగారమందుంచిరి.

వెంటనే మరొక సత్యాగ్రహిని సత్యాగ్రహ మొన ర్చుటకు మహాత్ముడు నియమించలేదు. వినోబా భావే నిర్బం ధమువలన ఎట్టి పరిస్థితు లుదయించునో వేచి చూడవలసి యుండునని మహాత్ముడు ప్రకటించెను. వైస్రాయిగారు యుద్ధ పత్రికల ప్రచారమునకు సంబంధించిన నెట్టివార్తలనైనను, ప్రభుత్వాధికారుల కంపి, అనుమతిపొందిగాని ప్రకటించకూడ దని నూతన శాసనమొకటి గావించెను. ఈ శాసనముక్రింద, ఇకముందు ప్రకటించి ప్రతివిషయమును అనుమతికై తమ వద్దకు పంపవలసియుండునని బొంబాయి ప్రభుత్వమువారు మహాదేవ దేశాయి సంపాదకత్వము క్రింద వెలువడు 'హరిజన' 'హరిజనబంధు' 'హరిజనసేవక' యను మూడు

పత్రికల ప్రకటనకర్తలకు నోటీసందజేసిరి.

మహాత్ముడు తానీపద్ధతి కంగీకరించజాలననియు వెంటనే పత్రికాప్రచురణ నిల్పివేసి, వైస్రాయితో వుత్తర ప్రత్యుత్తరము జరుపుదుననియు, వాటి ఫలితము ననుసరించి భావి కర్తవ్యము నిర్ణయించుకొందుననియు పత్రికలలో ప్రకటించెను.

గాంధి-వైస్రాయిల ఉత్తరప్రత్యుత్తర వివరములు యింకను ప్రకటింపబడలేదుగాని పరిస్థితుల బట్టిచూడ వైస్రాయి మహాత్ముని కోరిక నంగీకరించలేదని తెలియుచున్నది. ఆ కారణముచే మహాత్ముడు మరొక ఉపవాస వ్రతమునకు సంసిద్ధుడగుచుండెను. ఈవార్త భారతనాయకుల హృదయాందోళన కారకమై, ఉపవాసము వలదువలదని స్వయముగను, లేఖలమూలమునను, విన్నవించుకొనిరి. మహాత్ముడంగీకరించి తాత్కాలికముగా ఉపవాసవ్రతమునిల్పివేసెను.

ఈ ప్రకారం, నిరాయుధులు, నిస్సహాయులునగు భారతీయుల నుద్ధరించి పూర్వపు ఔన్నత్యమును తిరిగి స్థాపించుటకై కాంగ్రెసు స్థాపించబడినది. దాదాబాయి నౌరోజి, లోకమాన్య బాలగంగాధరతిలక్, గోపాలక్రిష్ణ గోఖ్లే, మొదలగు మహాపురుషులెందరో ఈ కాంగ్రెసును సేవించి తమ జీవితములు సార్థకమొనర్చుకొని భారతజాతి మన్ననలకు పాత్రులైరి. భారతజాతి, సోదరజాతులమధ్య గౌరవమర్యాదలకు నర్హమైనదిగా గావించి భారతస్వాతంత్ర్య భానోదయమునకు పూర్వముండు అంధకారమును పటాపంచలొనర్చిన గాంధీమహాత్ముని నాయకత్వము కాంగ్రెసును గమ్యస్థానము చేర్చుననుట కెట్టి సందేహమును లేదు.

(కాంగ్రెసుచరిత్ర రెండుభాగములు సంపూర్ణము)

# అణా గ్రంథమాల

## త్వరలో వచ్చుచున్న పుస్తకములు.

౧. జాగీర్లు ... సురవరం ప్రతాపరెడ్డి, ఉమ్మెత్తల కేశవరావు.
౨. మొగలాయి కథలు. ... సురవరం ప్రతాపరెడ్డి
౩. పండిత జవహర్లాల్ జీవితము... కె. రంగదాసు
౪. ఆంధ్ర గేయములు ... ... ...
౫. మన విద్యావిధానము ... ... ...
౬. వర్ధావిద్యావిధానము ... ... ...
౭. స్త్రీల సమస్యలు. ... ఇల్లిందల సరస్వతి.
౮. ఆంధ్రవాఙ్మయము ... కురుగంటి సీతారామయ్య.
౯. సోషలిజం ... గొబ్బూరి రామచంద్రరావు
౧౦. హిందువులు-మహమ్మదీయులు... మందముల నరసింగరావు.
౧౧. నిజాంరాష్ట్ర ప్రజాసమస్యలు... మందుముల రామచంద్రరావు
౧౨. బాధ్యతాయుత ప్రభుత్వము ... బూర్గుల రామక్రిష్ణరావు
౧౩. హన్మంతరావు కథలు ... మాడపాటి హన్మంతరావు.
౧౪. మాల్గుజారిపన్ను విధానము...నాగులపల్లి కోదండరామరావు
౧౫. హైద్రాబాదు మాల్గుజారిపన్ను విధానము... బి.ఎల్లారెడ్డి
౧౬. సంఘదురాచారములు ... ఎల్లాప్రగడ సీతాకుమారి
౧౭. హిందూమతము ... చిదిరెమఠము వీరభద్రశర్మ
౧౮. గాంధిజీవితము ... జానపాటి సత్యనారాయణ.
౧౯. గ్యారుబాల్డి ... నందూరి కృష్ణమాచారి.
౨౦. కందుకూరివీరేశలింగముపంతులు...ఆదిరాజు వీరభద్రరావు
౨౧ ఆంధ్రుల చరిత్ర ... ... ...
౨౨ ఆంధ్రోద్యమము ... ... ...
౨౩ హిట్లరు జీవితము గుండవరము హనుమంతరావు.